ఓ౩మ్

# వైదిక ధర్మ్మము

మాస పత్రిక

మనుర్భవ జనయా దైవ్యం జనమ్ (ఋగ్వే. ౧౦-౫౩-౬)

మానవుడ వగుము. దివ్యగుణములుగల మానవుని నిర్మింపుము


| సంపుటి | సౌర నభస్, ఇష (భాద్రపదము, ఆశ్వయుజము | సంచిక |
| --- | --- | --- |
| ౩+౧౨ | ౧౯౨౩ శా.సం.) ౨౦౫౮ వి. సం. | ౧, ౨ |


# సంస్కారముల యొక్క ఆవిర్భావము


రచయిత

**ఆచార్య వేదవ్రత మీమాంసక**

ఆర్షగురుకులము, వడ్లూరు, కామారెడ్డి, జిల్లా ఇందూరు.



సంపాదకులు

**ఆచార్య వేదవ్రత మీమాంసక**

ప్రకాశకుడు

**మనస్వీ**

ఆర్షగురుకులము, వడ్లూరు, కామారెడ్డి, జిల్లా ఇందూరు - ౫౦౩ ౧౧౧

# సంస్కారముల యొక్క ఆవిర్భావము

నేటి గుజరాతునందు పూర్వము మోర్వీయను రాజ్యమున టంకారా యను గ్రామముండెను. అందలి జీవాపురమను వీధియం దొక సామవేదీయ ఔదీచ్య బ్రాహ్మణ కుటుంబ ముండెను. అందు ౧౮౮౧ విక్రమ సంవత్సరము మాఘ. బ. ౧౦ నాడు ఒక శిశువు జన్మించెను. అతని తండ్రి బ్రాహ్మణుడు, ధనవంతుడు, భూస్వామి, నేటి జిల్లాధీశునికి సమానస్థాయిగల ప్రభుత్వాధికారి, విద్వాంసుడు, శివభక్తుడు. మూలనక్షత్రమున జన్మించుటచే ఆయన తన పుత్రునికి మూలశంకరు డని నామకరణము చేసెను. ప్రేమతో అందరు ఆశిశువును దయాలజీ అని పిలుచుచుండిరి. మూలశంకరునకు ఐదవ ఏట విద్యాభ్యాసము ప్రారంభించబడెను. సంస్కృతము నేర్పబడుచుండెను. ఆ బాలునికి ఎనమిదవ ఏట ఉపనయన సంస్కారముగావించి సంధ్యా వందనము నేర్పబడెను. రుద్రాధ్యాయము, యజుర్వేదము, కంఠస్థము, చేయించబడెను. తండ్రి శివోపాసకుడగుటచే పదు నాలుగు సంవత్సరముల ప్రాయముననే కుమారునికి శివునియందు ప్రీతి కలగించదలచి యతనిచే శివరాత్రి వ్రతము చేయించెను. తండ్రినుండి శివుని పరాక్రమమును విని బాలుడైన మూలశంకరుడు శ్రద్ధతో శివరాత్రి వ్రతము చేయబూనెను. పగలు ఉపవాసము చేసి రాత్రి యందు పూజలు చేసి తండ్రి మున్నగు వారితో కలిసి శివమందిరమునకు వెళ్ళెను.

శివమందిరమున పూజలు చేసిన తరువాత ఒక్కొక్కరు క్రమముగా నిద్రించిరి. బాలకుడైన మూలశంకరుడు మాత్రము నిద్రను పోగొట్టుకొనుటకు కన్నులపై నీటిని చల్లుకొనుచు మేలుకొని యుండెను. అంతలో ఒక ఎలుక వచ్చి అచట నున్న అక్షతలను తినసాగెను. విగ్రహముపైకి ఎక్కుచు దిగుచు గంతులు వేయసాగెను. ఇది సామాన్యజనులకు సామాన్యమే. మూల శంకరుడు బాలకుడే కాని అతని ఆత్మయం దడుగున పడియున్న తత్త్వ జ్ఞానము ఈ ఘట్టముచే పెల్లుబికినది. తండ్రి బోధించిన శివమహాత్మ్యమున కీ ఘట్టము సత్యాన్వేషియైన ఆబాలకునికి విరుద్ధముగా కనబడినది. తత్క్షణమే తన తండ్రిని మేల్కొలిపి సత్యమును తెలిసికొనగోరెను. రాక్షసులను సంహరించగలవాడును, పరాక్రమశాలియు నైన శివుడు తనపై

నున్న చిన్న ఎలుక నెందులకు పారద్రోలుట లేదని ప్రశ్నించెను. బాలుడైన మూలశంకరు డారాతి విగ్రహమునే శివుడని నమ్మియుండెను గదా! అందుచే ఆయన ప్రశ్న సహజము, తాత్త్వికము, వైజ్ఞానికము నైనది. దానికి తండ్రి అది శివుడు కాదని, అది కేవలము శివుని విగ్రహమని నిజమైన శివుడు కైలాసములో నుండునని తెలిపెను. ఒకతత్త్వము తెలిసికొనగోరువాని కా సమాధానము తృప్తిదాయకము కాదు. విగ్రహము నిజమైన శివుడు కాదేని దాని పూజ లేల చేయవలయు ననునది సహజమైన ప్రశ్న. మూలశంకరుడు శివుని గూర్చి తండ్రి యుపదేశము విని తన ఆత్మయందు శివుని యెడ భక్తి భావమును నింపుకొని యుండెను. ఆ భావము అతని హృదయములో దృఢమైయుండెను. అతడు వయసులో చిన్నవాడైనా నచికేతునివంటి సంస్కారవంతుడు. అతని యందు శివుని గూర్చి చెరగని ముద్రపడినది. అతని మనస్సున శివుని యెడ ఇతరుల కసాధ్యమైన భక్తిభావ మేర్పడినది. అది కల్పితము కాదు. మిథ్యకాదు. శివరాత్రికన్న పూర్వము శివుని గూర్చి తండ్రి యుపదేశము మూలశంకరుని జీవితమునకు పునాదిరాయి. అది ఆయన సమస్త జీవితమును ప్రభావితము చేసినది. ఆయన జీవితమున కదియే మార్గదర్శకమైనది. ఆయన జీవితమంతయు దాని కంకితమైనది. ఒక్క మాటలో చెప్పవలయునన్న ఆయన జీవితమునందలి సమస్త క్రియాకలావములు "కేవలము శివుని సాక్షాత్కరించుకొనుటకు, సాక్షాత్కరింపజేయుటకే" ఉద్దేశింపబడిన వనినచో అతిశయోక్తి కాజాలదు.

సంస్కారవంతుడైన మూలశంకరుడు అచ్చటనే నిజమైన శివుని దర్శించెద నని ఈ రాతి విగ్రహముకొరకు ఉపవాసము చేయనని మనస్సున నిశ్చయించుకొనెను. ఇంటికి వెళ్ళి భోజనము చేసికొనెను. ఆయన తత్త్వవేత్త అని తలిదండ్రుల కేమి తెలియును? వారేకాదు ఆ వయస్సులోనున్న ప్రతి బాలుని బాలునిగా భావించుట సహజమే. బాలురందరు ఆ వయసులో తత్త్వవేత్తలు కారుగదా!

మూలశంకరుడు రాతివిగ్రహము శివుడు కాదని కైలాసవాసియగు శివునికొరకే భక్తి సలుపవలయునని నిశ్చయించుకొని తన చదువులో మొదటి వలె మునిగియుండెను. రెండు సంవత్సరముల తరువాత అతనికన్న రెండు సంవత్సరములు చిన్నదియైన అతని చెల్లెలు కలరా వలన మరణించెను.

మూలశంకరుడు అంతవరకు మరణించగా ఎవరిని చూచి యుండలేదు. ఆయన కది మొట్టమొదటి మృత్యుదర్శనము. మృత్యువును చూచుటచే ఆయన హృదయమునకు వజ్రపాతమైనది. ఆ సమయమున ఎల్లరు కన్నీరు కార్చుచుండిరి. మూలశంకరుడు ఏమి తెలియక శిల వలె నిలబడి ఆ దృశ్యమును పరిశీలించుచుండెను. ఆయనకు భయము కలిగినది. ఈ ప్రపంచము క్షణికమని తోచినది. "నేనును ఒకనాడు చనిపోయెద"నని తెలిసినది. ఆయన ఈ మృత్యువునుండి తప్పించుకొనుట కేదేని ఉపాయమును వెదుకవలయు ననుకొనెను. ఎల్లరు కన్నీరుకార్చినా ఆయన మాత్రము విలపించలేదు. ఏలన, నేనుగూడ చనిపోయెద, నను భయము ఆయన నలుముకొనియుండెను.

మృత్యువును చూడగానే తాను మరణించక తప్పదను జ్ఞానము కలుగుట యోగము నభ్యసించుచు నిత్యానిత్యములను తెలిసికొనుటకు జగత్తును పరిశీలించు వివేకవంతులకే సాధ్యము. ఇట్టి తత్త్వజ్ఞానము సహజముగా లభించునది కాదు. మూలశంకరుడు విమలమనస్సుగలవాడు. అందుచేత మృత్యువును చూడగానే అతని ఆత్మలో ఈ జ్ఞాన ముదయించినది. మృత్యువునుండి తప్పించుకొనుట కుపాయ మాలోచించుచున్న మూలశంకరు డెట్లు విలపించగలడు? తలిదండ్రు లతనిని రాతివంటి హృదయముగలవా డనిరి ఆయనను వెళ్ళి నిద్రించు మనిరి. ఇతరుల మృత్యువును చూచి నిద్రించనివాడు తన మృత్యువును చూచుచు ఎటుల నిద్రించగలడు? విలపించుచున్నవారు ఆయన నెంత ఏవగించుకొనిన ఫలమేమి?

ఆ సమయమున ప్రపంచమే యనిత్య మనియు, ప్రపంచములో నున్నవా డెవడును మరణమును తప్పించుకొనజాల డనియు, తానుకూడా ఈ మరణమునకు గురియగుదు నని తలచుట మూలశంకరుని వంటివారికి సహజము. మరణమునుండి తప్పించగల మోక్షమునకొర కెంత ప్రయత్నించ వలసి వచ్చినా ప్రయత్నించెద నని మూలశంకరు డదే సమయమున నిశ్చ యించుకొనెను. అపుడు ప్రపంచమునుండి ఆయన మనస్సు విడిపోయెను.

చెల్లెలు చనిపోయిన తరువాత మూడు సంవత్సరములకు విద్వాంసు డును, ధర్మాత్ముడును నగు మూలశంకరుని పినతండ్రియు కలరా వ్యాధికి గురియై మరణించెను. ఆయన మూలశంకరుని తనయొద్ద కూర్చుండ

బెట్టుకుని ప్రీతితో జూచుచునే పరలోకమున కేగెను. ఆయన మృత్యువువలన మూలశంకరునికి ఎంతో బాధకలిగినది. అప్పు డాయన అతిగా విలపించెను. దానితో అతని కన్నులు వాచిపోయెను. ఈ ఘట్టముతో ఆయన మనస్సు ప్రపంచమునుండి విరక్తమయ్యెను. అయన ఈ లౌకిక జీవితమునుండి విడిపోయి మోక్షముకొరకు ప్రయత్నించవలయు నని పథకము వేయు చుండెను. అది తెలిసి తలిదండ్రులు పుత్రుని వివాహము కొరకు సన్నాహము లొనర్చ నారభించిరి. వారి ప్రయత్నములు ఫలించక పూర్వమే ఆయన ఎవరికి తెలియకుండ గృహమునుండి పారియెను.

మృత్యువును జయించుట, నిజమైన శివుని దర్శించుట మూలశంక రునికి ధ్యేయము. అందుకు ఆయన బ్రహ్మచర్యదీక్షను గ్రహించి శుద్ధచైతన్య బ్రహ్మచారిగా నొప్పెను. ఆయన గృహత్యాగము వలన ఆయన తలి దండ్రులకు తీరని బాధకలిగినది. వారాయనను వెదుకనారంభించిరి. తండ్రి బ్రహ్మచారి వేషములోనున్న కుమారుని వెదకి పట్టుకొని కోపమున కొడుకు కాషాయవస్త్రములను చింపివేసెను. ఇంటికి తీసికొనివచ్చి ఆయనను ఇరువురి కాపలాదారులకప్పగించి పారిపోకుండ ఉండుటకు గట్టి ఏర్పాటుచేసెను. అదను కనిపెట్టుకొనియున్న మూలశంకరుడు మరునటినాడు రాత్రి కాపలాదారులు నిద్రలో మునిగిపోవుట జూచి పారిపోయెను. కొంతదూరము వెళ్ళి ఒకానొక మందిరము ముందున్న వృక్షముపైకి ఎక్కి దానియందు దాగుకొని రాత్రిగడిపెను. మరుసటి సాయంకాలము చీకటి కమ్ముకొనగానే దిగి ప్రయాణము కొనసాగించెను. ఈ సారి పట్టుబడలేదు. శుద్ధచైతన్య బ్రహ్మచారి మొదటినాడు రాత్రి, రెండవనాడు పగలంతయు దాగుకొని ఆ వృక్షముపైన కాలము గడిపెను. అన్నపానములు లేవు. నిద్రలేదు. నిత్యకృత్యములు లేవు. కేవలము మృత్యువునుండి తప్పించుకొనుటకు యోగము నభ్యసించవలె నను ఒకే ధ్యేయము ఆయనను ఇంతటి త్యాగమునకు ప్రేరేపించినది.

శుద్ధచైతన్యు (మూలశంకరు)నికి ఈ ప్రపంచమున మరణము తప్పదను జ్ఞానము (= వైరాగ్యము) దృఢమైనది. దానినుండి మోక్షము సంపాదించ వలయు నను కోరిక బలపడినది. ఆయన కీ ప్రపంచము అశాశ్వతము, ప్రాపంచిక సుఖములు క్షణికము.

సంన్యాసము స్వీకరించి సంవత్సరముల తరబడి నిష్ఠతో యోగము నభ్యసించ ప్రయత్నించుచుండు విద్వాంసులకు, పీఠాధీశులకు, కాషాయ వస్త్రములు ధరించినవారికి సహితము ఈ వైరాగ్యము ప్రాప్తించదు. అది ఈ చిన్న వయసులో మూలశంకరుని కెటుల ప్రాప్తించె నను జిజ్ఞాస, ఆశ్చర్యము కొందరికి కలుగక తప్పదు. ఈ జిజ్ఞాస సహజము. "ఆయన పూర్వజన్మలలో యమనియమాదుల పాటించి నిత్యానిత్య వివేకమును సంపాదించి యుండెను, దాని వలన ఆయన కీజన్మలో ఈ యాధ్యాత్మసంపద లంభించి యుండె" నని ఒప్పుకొనక తప్పదు.

మరణము తప్పదను గట్టిజ్ఞానము మూలశంకరుని కదిలించినది. ఆ జ్ఞానము లౌకిక సుఖము ననుభవించవలయు నను ఆయన కోరికను వ్రేళ్లతో సహా పెకిలించివేసినది. ఇప్పుడాయనను ఏవిషయవాసన తనవైపు ఆకర్షించు స్థితిలో లేకుండెను. ఆయనకు చక్రవర్తిరాజ్యము కూడ వ్యర్థమే. ప్రపంచమే నశ్వరముగా కనబడినపుడు ప్రపంచములోని సుఖముల విలువ ఏమి? ఆధ్యాత్మిక జ్ఞానమునకు ఈ నిత్యానిత్యజ్ఞానము పునాదిరాయి. చిత్తవృత్తి నిరోధమున కిది అనివార్య సాధనము. ఈశ్వరసాక్షాత్కారమున కిదియే మూలము. ఇదిలేక ఈశ్వర ప్రణిధానము జరుగదు. ఈశ్వరప్రణిధానము లేనిది సమాధి సిద్ధించదు. సమాధి ప్రాప్తించనిచో అజ్ఞానము, రాగ ద్వేషములు, జన్మము తప్పవు. జన్మమున్నంతవరకు దుఃఖము, బంధనము తప్పదు. మృత్యువు నిశ్చిత మని తెలిసికొనిన మూలశంకరుని మనస్సు ప్రపంచమున నెటుల రమించగలదు? ఆయనకు యోగ మొకటే ఆశ్రయము. దానికొరకే ఆయన ఇల్లు వదలి బయలుదేరెను.

శుద్ధ చైతన్యుడు యోగము నభ్యసించుటకు యోగులను వెదుక నారంభించెను. యోగులుండు రని తెలిసిన ప్రతి స్థానముకు వెళ్ళెను. యోగము నేర్చుకొన ప్రయత్నించెను. యోగముకొరకు యత్నించుచు తత్త్వజ్ఞానము కొరకు వివిధ ఆచార్యుల వద్ద, యోగుల వద్ద యోగవేదాంతాది శాస్త్రములను అధ్యయనము చేయుచు పరిశీలించుచుండెను. ఈ విధముగా యోగసాధనమున ఆయన దాదాపు ౧౫ సంవత్సరములు గడిపెను. నిజమైన యోగుల అన్వేషణలో ఆయనకు ఆశ్రమములు, అరణ్యములు, గుహలు తిరుగవలసి వచ్చెను. ఆయనలో నిజమైన వైరాగ్యము నిండియుండెను.

దానిచే ఆయనకు ఈశ్వర పణిధానము సహజమైనది. ఈశ్వరప్రణిధానముచే ఆయన సమాధిని (ఈశ్వరసాక్షాత్కారమును) సిద్ధింపజేసికొనెను. కొంత కాలమువరకు యోగమయ జీవితము గడిపి సమాధిలో నైపుణ్యమును సంపాదించెను. రెండవసారి ఇల్లు వదలిన తరువాత ఆయన సంన్యాసదీక్ష గ్రహించి స్వీకరించిన నామము స్వామి దయానంద సరస్వతి. దయానంద స్వామి ఈ విధముగా యోగముచే మృత్యువును జయించి తాను సంపాదించిన ఆత్మపరమాత్మ జ్ఞానమును మానవమాత్రులకు ప్రసాదించదలచెను. అందుల కాయన విరజానంద దండీ గురువర్యుల వద్ద ప్రాచీన వ్యాకరణము మున్నగు వేదాంగములను విధిపూర్వకముగ నభ్యసించెను. అచట విద్య ముగించుకొని కొంతకాలము వరకు యోగసాధనతోపాటు వేదాది సకల శాస్త్రములను క్షుణ్ణముగా పరిశీలించెను. "వేదములు సత్యవిద్యల గ్రంథములు. అవి ఈశ్వరీయములు, నిర్భ్రాంతములు. అవి సకల సత్యవిద్యలకు, ప్రపంచమున వ్యాపించియున్న సమస్త సత్య జ్ఞానమున కాధారము"లని గ్రహించెను. ఉపవేదములు వేదముల నుండి స్వీకరించబడిన విద్యా గ్రంథములు, వేదాంగోపాంగములు, బ్రాహ్మణాది గ్రంథములు వేదవ్యాఖ్యానము లని తెలిసికొనెను. రామాయణ మహాభారతములను ప్రాచీన ఇతిహాస గ్రంథము లని గ్రహించెను. వేద విద్యవలననే ఈ ఆర్యావర్తదేశము ప్రపంచ చక్రవర్తి రాజ్యము నేలిన దని శ్రీమద్దయానందమహర్షి ఘోషించెను. ఆ వేదవిద్య చేతనే మానవుడు ఇహపర సుఖముల ననుభవించగలడని పేర్కొనెను. వేదజ్ఞానము లుప్తమగుటవలన చక్రవర్తి రాజ్యము నశించి ప్రపంచమునందలి మానవ సమాజము నానా బాధలలో చిక్కుకొన్న దనెను. పాశ్చాత్యులు ఆ వేదవిజ్ఞానమును వక్రీకరించి చిత్రించుచున్న విషయమును దయానంద మహర్షి గ్రహించెను. వారు వైదిక సంస్కృతీ సభ్యతలను నాశనము చేయుటకు, ఈ దేశమునందలి అపరిమిత ధన సంపత్తిని కొల్లగొట్టుటకు, ఈ దేశప్రజలను క్రైస్తవులను జేయుటకు, ఈ దేశమును సర్వవిధముల నిర్వీర్యము చేయుచున్న సంగతి ఆయన దివ్య దృష్టికి గోచరించెను. ఆయన వేదమును ఆధారముగా గొని సమస్త ప్రపంచమున వ్యాపించియున్న అజ్ఞానాంధకారమును నిర్మూలించ సమకట్టెను. దానితో విదేశీయ పాలనలో క్రుమ్మగ్గుచున్న ఆర్యావర్తము స్వాధీనమై మరల ప్రపంచమునందు ఆర్యచక్రవర్తి సామ్రాజ్యమును స్థాపించ సాధ్యమగుననియు ప్రపంచము నందలి మానవులు సుఖశాంతుల

ననుభవించగలరనియు తెలిసికొనుట కాయనకు చాల కాలము పట్టలేదు.

ఈశ్వరీయ జ్ఞానమైన వేదములయొక్క వాస్తవిక సిద్ధాంతములను అనుసరించుట సర్వవిధముల మానవ సమాజోన్నతికి ఏకైకోపాయము. ఇది దయానంద మహర్షి మంతవ్యము. దీనిని ప్రపంచమున వ్యాపింపజేయుటకు ఆయన జీవితము నర్పించెను. ఆయనను భయప్రలోభనములు ఈ మార్గము నుండి విచలితము చేయలేకపోయినవి. వైదిక సిద్ధాంతవ్యాప్తికై ఆయన త్రివిధోపాయముల నవలంబించెను.

౧ వైదిక సిద్ధాంతమునాచరించుట. ౨ వైదిక సిద్ధాంతమును రచనల ద్వారా ప్రకటించుట. ౩ ఉపన్యాసము లిచ్చుట, శంకాసమాధానములను శాస్త్రార్థములను చేయుట.

ఋషి దయాందుని జీవితము యోగమయము. ఆయనకు వేదధర్మము నాచరించుటయే ప్రియము. ఆయన వేదమునకు ప్రతికూలమగు ఆచరణను అణు మాత్రముకూడా ఒప్పుకొనడు.

ఋషి దయానందుడు వేదసారమును "సత్యార్థ ప్రకాశ"మను గ్రంథరూపమున ప్రకాశింపజేసెను. వేదసిద్ధాంతమునెరుగుటకు వాస్తవ వేదార్థములను తెలిసికొనుట అవసరము. దానికై ఆయన వేదభాష్యమును రచించెను. ఆ భాష్యమునకు ఆయన రచించిన భూమిక వైదిక సాహిత్యమున అనుపమము. అది వేదములయొక్క స్వరూపమును బోధించుటలో సాటిలేని గ్రంథము. ఆయన సమగ్ర యజుర్వేద భాష్యమును రచించెను. ఋగ్వేద భాష్యము సంపూర్ణము కాకముందే విష ప్రయోగమునకు బలియయ్యెను. దానివలన ఋగ్వేదభాష్యము అసంపూర్తిగానే మిగిలిపోయినది.

ఉత్తమ మానవుల నిర్మాణము కొరకు ఉత్తమ సంస్కారము లవసరము. అందుల కాయన ప్రాచీన ఆర్ష గ్రంథముల ఆధారమున సంస్కారవిధి యను గ్రంథమును రచించి ఆ సంస్కారముల యొక్క స్వరూపమును, వాటిని నిర్వహించు పద్ధతిని సూచించెను. పంచమహా యజ్ఞవిధి, గోకరుణానిధి, ఆర్యాభివినయము మున్నగు అనేక గ్రంథములను రచించి వైదిక సిద్ధాంతములను వెలుగులోనికి తెచ్చెను.

ఆయన జీవితాంతము ఉపన్యాసములచే, శంకాసమాధానములచే శాస్త్రార్థములచే మానవ సమాజోద్ధరణకై నిర్విరామముగ కృషి సలిపెను.

స్వామి దయానందుని దివ్యస్వరూపమును తెలిసికొనుటకు ఆయన ఆచరణను తెలిసికొనుట అవసరము. దానిని తెలిసికొనుట కిచట కొన్ని ఘట్టములను పొందుపరచుచున్నాను. ఈ ఘట్టములను తెలిసికొనక ఆయన స్వరూపమును తెలిసికొనుట సాధ్యముకాదు.

౧. ఒకనాడు ఆయన సభలో పురాణములందలి మిథ్యా అంశములను సమీక్షించుచుండ ఆ సభలోనున్న జిల్లాధీశుడు, ఆయుక్త (కమిష్నర్) మున్నగు ఐరోపావాసులు సంతసించుచుండిరి. దయానందు డా తరువాత క్రైస్తవ మతమును సమీక్షించెను. అది విని జిల్లాధీశుడు స్వామివారి అనుచరులకు "మీ పండితులవారికి క్రైస్తవులను తీవ్రముగా విమర్శించకూడ దని తెలుపవలయు"నని సూచించెను. అది గమనించిన ఋషి దయానందుడు మరునాడు సభలో ప్రవచనము ప్రారంభించుచు నిటుల పేర్కొనెను. "సత్యమును ప్రకటించగూడదు, దానితో జిల్లాధీశు డప్రసన్ను డగును. ఆయుక్తుడు అసంతుష్టు డగును, రాజ్యపాల బాధపడునని జనులు నుడువుదురు. అతడు చక్రవర్తి రాజే కావచ్చును. గాక! నేను అతనిముందు గూడ సత్యమునే పలికెదను. **స్వామి దయానందుని ఆత్మను నశింపజేయు వాడు జన్మించనంతవరకు స్వామి దయానందుడు సత్యమునే పలుకును."**

౨. ఒకసారి అనూపశహర (ఉత్తర ప్రదేశము) నందుండగా ఒక బ్రాహ్మణుడు తాంబూలమునందు విషము కలిపి పైకి శ్రద్ధను కనబరచుచు దయానందస్వామికి సమర్పించెను. ఆయన దానిని స్వీకరించి సేవించెను. అందులో విషము గలదని తెలిసికొన్న దయానంద స్వామి తత్కాలము యమునానది సమీపమునకు వెళ్లి, న్యౌలిక్రియ సలిపి, ఆ విషమును దూరము చేసికొని తిరిగి తన వసతికి చేరుకొనెను. ఆ వార్త నగరములో వ్యాపించెను. అది విన్న తహసీలదారు ఆ బ్రాహ్మణుని అన్వేషించి పట్టుకొని, సంకెళ్లతో బంధించి, స్వామీజీ ముందుంచెను. అపుడు స్వామీజీ తహసీలదారుతో "నేను ప్రపంచమును బంధమునుండి విడిపించుటకు వచ్చియున్నాను, బంధనములో వేయుటకు రాలేదు. ఆ బ్రాహ్మణుని విడిచి పెట్టుము" అనెను. అదివిని తహసీలదారు బ్రాహ్మణుని వదలివేసెను.

దయానందమహర్షి జీవించియున్నచో భారతదేశమున తమరాజ్యము మనజాలదని ఆంగ్లేయులు తెలిసికొనిరి. వారు ఆయనను చంపుటకు అనేక విధముల యత్నించిరి. ఒకనాడు మహర్షికి పాలలో విషము కలిపి వంటవానిచేత ఇప్పించిరి. పాలు స్వీకరించిన స్వల్పకాలమునకే అందులో విషము గలదని ఆయనకు తెలిసినది. విషము నొసగిన తన పాచకుని తన సమీపమునకు పిలిచికొని "ఓయీ జగన్నాథ! నేను గతించుటచే నేను చేయతలపెట్టిన కార్యము అపూర్ణముగనే మిగిలిపోయినది. దీనివలన లోకమునకు జరుగనున్న ఉపకారము అపూర్ణముగనే ఆగిపోయినది. నీవు ఆ కార్యము యొక్క మహత్త్వమును ఊహించజాలవు, అస్తు. నీ ఈ విషయము అంతట వ్యాపించును. తదుపరి నా అనుయాయులు నిన్ను క్షమించరు. తప్పక శిక్షింతురు. నీవు ఇచటి నుండి నేపాలుదేశమునకు పారిపొమ్మని నుడివి అతనికి దాదాపు(౫౦౦)ఐదువందల రూప్యము లొసగెను.

మహర్షి కొసగబడిన విషమువలన ఆయన శరీరము ఖర్బూజాఫలము వలె పగిలి ద్రవము బయటకు వెడలుచుండెను. దీపావళి అమావాస్యనాడు ఆయన క్షౌరము చేయించుకొని స్నానము చేసెను. సాయంత్రము ఆయనచే పిలిపించబడిన భక్త జనులు ఆయనస్థితిని చూసి కంటతడి బెట్టి నిశ్చేష్టులైయుండిరి. అట్టి అసహ్యస్థితిలో సహితము ఆయన ముఖవర్చస్సులో ఏమియు మార్పుకనబడలేదు. బాధాసూచకమగు చిహ్నముగాని, శబ్దముగాని లేకుండెను. ఆయన గంభీరమైన ముద్రలో అందరికి ధైర్యము కలుగునటుల ఉపదేశించెను. వారికి తమ గురుతర బాధ్యతలను సూచించెను. దహన సంస్కారము తరువాత తన స్మృతిలో ఏ విధమైన స్మృతి చిహ్నము నిర్మించ గూడదనెను. ఆ భస్మమును కూడ ఏదేనొక రైతు భూమియందు చల్లు డనెను. వేదమంత్రముల నుచ్చరించి సంస్కృతభాషలో ఈశ్వరుని స్తుతించి "హే ఈశ్వర! తూనే అచ్ఛీ లీలాకీ. తేరీ ఇచ్ఛాపూర్ణ హో" ఓ ఈశ్వర! నీవు మంచి లీలను సలిపితివి. నీకోరిక సఫలమగును గాక! యని పలికెను. ప్రాణాయామము సలిపి శరీరమును శయ్యపైన వాల్చెను. ఆ మరుక్షణమున ఆయన ఆత్మ నశ్వర శరీరమును వదలి అనంతాకాశములో విలీనమై పోయెను.

ఈ స్థితిని గమనించిన మునివర గురుదత్త విద్యార్థి రోదించ నారంభించెను. ఇంతవరకు ఈశ్వరుని గూర్చి ఆయన మనస్సులో నున్న సందేహము ఋషి దయానందుని ఈ మరణ ఘట్టము చూచుట వలన దూరమాయెను. ఈ ఘట్టము వలన ఈశ్వరుని యెడ ఆయనకు గల సందేహమునకు సమాధానము లభించెను. దయానంద మహర్షి జీవనము అతిపావనము. ఆయన దివ్య చరితము శివభక్తితో ప్రారంభమైనది. మృత్యుభయముతో ముందుకు సాగినది. పరమాత్మసాక్షాత్కారముతో పరిపూర్ణమైనది. వేదాజ్ఞానుకూలముగ ఆయన సమస్త జీవనము కొనసాగినది. చివరికి పరాత్పరుడైన పరమాత్మ నందు విలీనమైనది. యోగమయమైన జీవితము నశ్వరశరీరత్యాగముతో పూర్తియైనది. ఆయన జీవనము పరమాత్మను సాక్షాత్కరించుకొనుట, అతని పావన విజ్ఞానమైన వేదము ననుసరించుటకే అర్పితమైనదని వేరుగా తెలుపవలసిన అవసరము లేదు - అటువంటి జీవిత మెచ్చటను కనబడలేదు. వినబడలేదు. దానికదియే సాటి.

దయానంద మహర్షి మనుగడ మానవులను మానవులుగా తీర్చిదిద్దుట అనగా వారిని ఆస్తికులను, ధర్మాత్ములను, యోగులనుగా జేసి మానవ సమాజము నుద్ధరించుటకే యనవచ్చును. ఈ అంశము ఆయన విరచిత సమస్త సాహిత్యమునందు ప్రతిబింబించును. ఆయన కృతు లనేకములు. ఆ కృతులయందొక విశిష్టమైన కృతి సంస్కారవిధి.

"మనుర్భవ, జనయా దైవ్యం జనం" అని వేదము మానవుల నాదేశించుచున్నది. ఓ మానవుడా! నీవు మానవుడవగుము. మానవుడవై దివ్యగుణములతో విలసిల్లు మానవోత్తముల నిర్మించుము. సుఖశాంతుల గోరు మానవుడు ముందు మానవుడు కావలసియుండును. మానవు డగుటకు అతనియందలి సకల దుర్గుణములు దూరము కావలయును, సకల సద్గుణములు ప్రవేశింపవలయును. దేని మూలమున మానవునిలోగల దుర్గుణములు తొలగిపోవునో, సద్గుణములు అలవడునో దానిని సంస్కార మందురు. దయానంద మహర్షి సంస్కారముల గూర్చి ఈ క్రింది విధముగా పేర్కొనెను "సంస్కారములవలన సంస్కరించబడిన (ఆత్మాది) పదార్థములు ప్రపంచమున మేధ్యం = శుద్ధము, పునీతమనబడును. సంస్కరింపబడనివి అమేధ్యము=అశుద్ధమనబడును. సంస్కారములు ఎల్లవేళల సుఖములను

పెంపొందించును. కావున విద్వాంసుల చేతను, విద్యచేతను, ఓషధముల చేతను అవి నిత్యము అనుసరించదగినవి. వానివలన శరీరము ఆత్మ పవిత్రమగును.......... సంస్కారములలో పేర్కొనబడిన క్రియలవలన శరీరము, ఆత్మ సుసంస్కృత ములగును. దానివలన ధర్మార్థకామమోక్షములు సిద్ధించును. ఉత్తమ సంతానము కలుగును. అందుచే సకల మానవులు ఈ సంస్కారములను సంపన్నము చేసికొనవలయును."

ఈ సంస్కారములు కేవలము స్వదేశమునందేకాక ఒకానొకప్పుడు పదో రూపమున విశ్వము నందంతట ఆచరించబడుచుండెను.

౧. **హరివర్షము** (ఐరోపా) నందలి స్లోవానియా దేశీయులు శవమును దహనము చేయుదురు.

౨. పురాతన **యూనానుదేశీయులు** శవమును దహనము చేయుచుండిరి.

౩. **బాలీద్వీపమున** నాలుగు వేదములు గలవు. వివాహ సంస్కారము నేటికిని మన ఆర్యులవలెనే నిర్వహింపబడును. హోమము నిర్వహించ బడును. అందులో చందనసమిధ లుపయోగింపబడును. సంన్యాసాశ్రమ మునకు మిక్కిలి మహత్త్వము గలదు. ఆ ద్వీపవాసులు వృద్ధాప్యమున సంన్యాసము స్వీకరించి పర్వతగుహలలో యోగము సలుపుటను పుణ్యమని భావింతురు. వారు నామకరణ సంస్కారమును జరుపుకొందురు. సూర్యసుత, రవిసుత, చంద్రసుత మున్నగు నామములను ధరింతురు. శవమును దహనము చేయుదురు.

౪. **ఫిలిప్పీను** :- ఇచటివారు దాక్షిణాత్యులవలె శిఖను ధరించెడివారు, శవమును దహనము చేసెడివారు.

౫. **జపాను** :- ఇచట పూర్వము ఆర్యధర్మ ముండెను. ఆపైన బౌద్ధమతము వ్యాపించెను. అందులో అశ్వమేధమును బోలిన యజ్ఞ మొకటి ప్రచలితమై యుండెను. జపానులో అగ్ని పూజ జరుగును. ప్రధాన ఈసీ మందిరమున అరణిమంథనముచే అగ్ని ఉత్పన్నము చేయబడును. శవమునకు స్నానము చేయించబడును. తదుపరి శవము దహనము కావించబడను.

౬. **ఈరాను** :-ఈ దేశీయులు ఉపనయన సంస్కారము గావించుకొందురు. ఉపనయనమును వారు నవజోత (నవజీవిత = క్రొత్తజీవిత) మందురు. బ్రహ్మసూత్ర (ఉపవీత) మును, మనవలె ఎడమభుజముపైన ధరించరు. మేఖల (మొలత్రాడు) వలె కటియందు ధరింతురు. వారు బ్రహ్మసూత్రమును కుస్తీ యందురు. పారసీకులు జరుపుకొను జాతకర్మ, అన్నప్రాశనము, ఉపనయనము అను సంస్కారములు ఆర్యుల సంస్కారములను పోలియున్నవి. వారు ఆర్యులవలె అగ్నిని అర్చింతురు. యజ్ఞము సలుపుదురు.

౭. **ఈరాకుదేశీయులు** శవమును దహనము చేయుచుండిరి

౮. **చైనాదేశమున** ఉపవీతమును ధరించియున్న బ్రాహ్మణుల చిత్రములు లభించినవి.

౯. **కంబుజ** (కంబోడియా) :- ఈ దేశస్థులు తమను ఆర్యవంశీయులుగా భావింతురు. వేయి సంవత్సరముల క్రిత మిచట వైదిక వర్ణ వ్యవస్థ నెలకొనియుండెను. ఇచటి జనులు సుగంధముగల ఇంధనముల చితిని పేర్చి శవమును దహనము చేయుదురు.

౧౦. **బారామతీ (స్యాం) (థాయిలాండు)** వాసులు అనేక సంస్కారములను వైదిక పద్ధతిలో జరుపుకొందురు. వారు జన్మించినపుడు శిశువు హస్తమున నొక సూత్రమును బంధింతురు. చూడాకర్మ అతి వైభవముగా జరుపబడును. దీనిని అచటి మహమ్మదీయులు కూడా జరుపుకొందురు. అచటివారు వివాహసంస్కారమును స్వయంవర మనుచున్నారు. దీవలన స్వయంవర వివాహములే జరుగుచుండె నని ఆ పద్ధతి క్రమముగా క్షీణించిన దని తెలియుచున్నది. ఇచట వివాహము చాలవరకు భారతీయులవలెనే జరుగును. జనులు మంత్రముల నుచ్చరించి సంస్కారమును సంపన్నము చేసికొందురు. ఆ దేశీయులలో మృతుడు "దివంగత" అను శబ్దముతో వ్యవహరించ బడును. శవదాహనము జరుపబడెను.

౧౧. **చంపా (ఇండోచైనా)** యందు పూర్వము వర్ణవ్యవస్థ కొనసాగినది. అందు శవమును సుగంధిత కాష్ఠములతో సిద్ధము చేయబడిన చితియం దుంచి దహనము చేయుదురు. ఆ దాహకర్మ వైదిక పద్ధతిని బోలియుండును. యశోవర్మ అనబడు రాజు వానప్రస్థ సంన్యాసుల కొరకు కనీసము వంద ఆశ్రమములను నిర్మించెను.

౧౨. **యూనాను మరియు రష్యాదేశీయులు** యజ్ఞముతో సలుపుకొనునట్టి ధార్మిక విధానములు చాలవరకు ఆర్యుల సంస్కారము లను పోలి యుండును. వారి వివాహ పద్ధతియు ఆర్యుల వివాహపద్ధతివలె నుండును.

౧౩. **క్రైస్తవులలోను, మహమ్మదీయులలోను** జాతకర్మ = కన్ఫర్మేషన్, నామకరణము = బప్తిస్మా, వివాహము మున్నగు సంస్కారములు గలవు. ఇవి పూర్వకాలమున ఆర్యులనుండి గ్రహించబడినవి. మహమ్మదీయులలో ఊదుదాన్ (ఊదుపాత్ర) వికృతయజ్ఞకుండమే. బైబిలులోగల వేదిక నిర్మాణము, "యాజకు"డను శబ్దము వైదిక ధర్మములో పేర్కొనబడిన యాజ్ఞికవిషయము నకు సంబంధించినవే.

దయానంద ఋషి వేదమును పరమాత్మునిచే ప్రసాదింపబడిన జ్ఞానముగా స్వీకరించెను. వేదముల కనుకూల మగు వైదిక గ్రంథములను ప్రామాణికముగా నెంచెను. అందుచే ఆయన సంస్కారవిధియం దాదిలోనే "వేదాదిశాస్త్ర సిద్ధాంతమాస్థాయ పరమాదరాత్" వేదశాస్త్రముల సిద్ధాంతమును పరమశ్రద్ధతో స్వీకరించి - అని వ్రాసెను.

సంస్కారములు వేదములలో బీజరూపమున పేర్కొనబడిన వని సంస్కారవిధియందలి మంత్రముల వలన స్పష్ట మగుచున్నది. ఈ సంస్కారములలోని కొన్ని సంస్కారములు ఉపవేదమగు ఆయుర్వేదములో విపులముగా వ్యాఖ్యానించబడినవి. అవి బ్రాహ్మణాది గ్రంథములలోను గలవు. ప్రముఖముగా వేదాంగము లగు కల్ప (శ్రౌత, గృహ్య, ధర్మ) సూత్రములలో పేర్కొనబడినవి. అందులోను గృహ్యసూత్రములలో విస్తారముగా పేర్కొనబడినవి. కొన్ని గృహ్యసూత్రములలో నున్న సంస్కారముల నిచ్చట పొందుపరచుచున్నాను.

## ప్రాచీన సూత్రగ్రంథములందలి సంస్కారములు :-

**ఆశ్వలాయన గృహ్యసూత్రము :-** ౧. వివాహము ౨. గర్భాలంభనము ౩. పుంసవనము ౪. సీమంతోన్నయనము ౫. జాతకర్మ ౬. నామకరణము ౭. అన్న ప్రాశనము ౮. చౌల (చూడాకర్మ) ౯. ఉపనయనము ౧౦. వేదారంభము ౧౧. గోదానము (కేశాంతము) ౧౨. సమావర్తనము ౧౩. అంత్యేష్టి

**పారస్కరగృహ్యసూత్రము :-** ౧. వివాహము ౨. చతుర్థీకర్మ (గర్భాధానము) ౩. పుంసవనము ౪. సీమంతోన్నయనము ౫. జాతకర్మ ౬. నామకరణము ౭. నిష్క్రమణము ౮. అన్నప్రాశనము ౯. చూడాకర్మ ౧౦. ఉపనయనము ౧౧. వేదారంభము ౧౨. కేశాంతము ౧౩. సమావర్తనము ౧౪. అంత్యేష్టి

**ఆపస్తంభగృహ్య సూత్రము :-** ౧. వివాహము ౨. ఋతుగమనము ౩. పుంసవనము ౪. సీమంతోన్నయనము ౫. జాతకర్మ ౬. నామకరణము ౭. అన్న ప్రాశనము ౮. చౌల ౯. గోదానము ౧౦. ఉపనయనము ౧౧. వేదారంభము ౧౨. సమావర్తనము.

**కౌశీతకీ గృహ్య సూత్రము :-** ౧. వివాహము ౨. గర్భాధానము ౩. పుంసవనము ౪. గర్భరక్షణ ౫. సీమంతోన్నయనము ౬. జాతకర్మ ౭. అన్నప్రాశనము ౮. చూడాకర్మ ౯. గోదానము (కేశాంతము) ౧౦. ఉపనయనము ౧౧ వేదారంభము ౧౨ సమావర్తనము

**హిరణ్యకేశి గృహ్య సూత్రము :-** ౧. ఉపనయనము ౨. వేదారంభము ౩. సమావర్తనము ౪. వివాహము ౫. చతుర్థీకర్మ ౬. సీమంతోన్నయనము ౭. పుంసవనము ౮. జాతకర్మ ౯. చూడాకర్మ ౧౦. గోదానము

**మానవగృహ్యసూత్రము :-** ౧. వివాహము ౨. గర్భాధానము ౩. సీమంతోన్నయనము ౪. పుంసవనము ౫. జాతకర్మ ౬. నామకరణము ౭. నిష్క్రమణము ౮. అన్నప్రాశనము ౯. చూడకర్మ ౧౦. కేశాంతము ౧౧. ఉపనయనము ౧౨. వేదారంభము ౧౩. సమావర్తనము

**గోభిలగృహ్యసూత్రము :-** ౧. వివాహము ౨. గర్భాధానము ౩. పుంసవనము ౪. సీమంతము ౫. జాతకర్మ ౬. నిష్క్రమణము ౭. నామధేయకరణము ౮. చూడాకరణము ౯. ఉపనయనము ౧౦. వేదారంభము ౧౧. గోదానము ౧౨. సమావర్తనము

**జైమిని గృహ్యసూత్రము :-** ౧. వివాహము ౨. గర్భాధానము ౩. పుంసవనము ౪. సీమంతోన్నయనము ౫. జాతకర్మ ౬. నామకర్మ ౭. ప్రాశనకర్మ ౮. చౌలకర్మ ౯. ఉపనయనము ౧౦. గోదానము ౧౧. సమావర్తనము

**ఖాదిరగృహ్యసూత్రము :-** ౧. వివాహము ౨. గర్భాధానము ౩. పుంసవనము ౪. సీమంతోన్నయనము ౫. జాతకర్మ (సోష్యంతీహలోమ) ౬. నిష్క్రమణము ౭. చౌల ౮. నామకరణము ౯. ఉపనయనము ౧౦. వేదారంభము ౧౧. గోదానము

**కౌశిక సూత్రము :-** ౧. వివాహము ౨. గర్భాధానము ౩. నామకరణము ౪. అన్న ప్రాశనము ౫. నిర్ణయనము (నిష్క్రమణము) ౬. గోదానము ౭. చూడాకరణము ౮. ఉపనయనము ౯. వేదారంభము ౧౦. పితృమేధము (అంత్యేష్టి)

**బౌధాయన గృహ్యసూత్రము :-** ౧. వివాహము ౨. గర్భాధానము

౩. పుంసవనము ౪. సీమంతోన్నయనము ౫. జాతకర్మ ౬. నామకరణము ౭. ఉపనిష్క్రమణము ౮. అన్న ప్రాశనము ౯. చూడాకర్మ ౧౦. కర్ణవేధ (గృహ్యశేషము) ౧౧. ఉపనయనము ౧౨. సమావర్తనము ౧౩. పితృమేధము

**వారాహగృహ్యసూత్రము :-** ౧. జాతకర్మ ౨. నామకరణము ౩. దంతోద్గమనము ౪. అన్న ప్రాశనము ౫. చూడాకర్మ ౬. ఉపనయనము ౭. వేదవ్రతాని ౮. గోదానము ౯. సమావర్తనము ౧౦. వివాహము ౧౧. గర్భాధానము ౧౨. పుంసవనము ౧౩. సీమంతోన్నయనము

**వైఖానస గృహ్యసూత్రము :-** ౧. ఋతుసంగమము ౨. గర్భాధానము ౩. సీమంతము ౪. విష్ణుబలి ౫. జాతకర్మ ౬. ఉత్థానము ౭. నామకరణము ౮. అన్నప్రాశనము ౯. ప్రవాసగమనము ౧౦. పిండవర్ధనము ౧౧. చౌలకము ౧౨. ఉపనయనము ౧౩. పారాయణము ౧౪. వ్రతబంధవిసర్గము ౧౫. ఉపాకర్మ ౧౬. ఉత్సర్జనము ౧౭. సమావర్తనము ౧౮. పాణిగ్రహణము

**గోపథబ్రాహ్మణము :-** ౧. గర్భాధానము ౨. పుంసవనము ౩. సీమంతోన్నయనము ౪. జాతకర్మ ౫. నామకరణము ౬. నిష్క్రమణము ౭. అన్నప్రాశనము ౮. గోదానము ౯. చూడాకరణము ౧౦. ఉపనయనము ౧౧. ఆప్లావనము (సమావర్తనము)

## కొన్ని స్మృతులలో పేర్కొనబడిన సంస్కారములు

**యాజ్ఞవల్క్యస్మృతి:-** ౧. గర్భాధానము ౨.పుంసవనము ౩. సీమంతోన్నయనము ౪. జాతకర్మ ౫. నామధేయము ౬. నిష్క్రమణము ౭. అన్నప్రాశనము ౮. చూడాకర్మ ౯.ఉపనయనము లేదా మౌంజీబంధనము ౧౦. సమావర్తనము ౧౧. వివాహము ౧౨. స్మశానము

**గోతమస్మృతి :-** ౧. గర్భాధానము ౨. పుంసవనమ ౩. సీమంతోన్నయనము ౪. జాతకర్మ ౫. నామకరణము ౬. అన్నప్రాశనము ౭. చూడాకర్మ ౮. ఉపనయనము ౯. - ౧౨. వేదవ్రతము ౧౩. స్నానము (సమావర్తనము) ౧౪. వివాహము ౧౫. నుండి ౧౯. పంచమహాయజ్ఞములు ౨౦. నుండి ౪౦. దైవసంస్కారములు

**అంగీరాస్మృతి :-** ౨౫. సంస్కారములు పేర్కొనబడినవి. ౧. గర్భాదానము ౨. పుంసవనము ౩. సీమంతము ౪. జాతకర్మ ౫. నామక్రియా ౬. నిష్క్రమణము ౭. అన్నప్రాశనము ౮. చూడాకర్మ ౯. కర్ణవేధము ౧౦. వ్రతాదేశము ౧౧. వేదారంభము ౧౨. కేశాంతము ౧౩. స్నానము (సమావర్తనము) ౧౪. వివాహము ౧౫. అగ్నిపరిగ్రహము ౧౬. త్రేతాగ్ని సంగ్రహము ౧౭. పంచమహాయజ్ఞములు ౧౮. అష్టకా ౧౯. శ్రావణీ ౨౦. ఆశ్వయుజీ ౨౧. ఆగ్రాయణ ౨౨. వేదారంభము ౨౩. వేదోత్సర్జన ౨౪. ప్రత్యవరోహణము ౨౫. దర్శశ్రాద్ధము. మొదటి నుండి ఆదితః ౧౪. సంస్కారములు. అవశిష్ట మిగిలిన ౧౧. సంస్కారములు దేవ సంస్కారములు

**వ్యాసస్మృతి:-** ౧. గర్భాధానము ౨. పుంసవనము ౩. సీమంతము ౪. జాతకర్మ ౫. నామక్రియ ౬. నిష్క్రమణము ౭. అన్నప్రాశనము ౮. వపనము (చూడాకర్మ) ౯. కర్ణవేధము ౧౦. వ్రతాదేశము ౧౧. వేదారంభము ౧౨. కేశాంతము ౧౩. స్నానము ౧౪. ఉద్వాహము ౧౫. వివాహాగ్ని పరిగ్రహము ౧౬. త్రేతాగ్ని సంగ్రహము.

**జాతుకర్ణ్య:-** ౧. గర్భాధానము ౨. పుంసవనము ౩. సీమంతము ౪. జాతకర్మ ౫. నామకరణము ౬. అన్నప్రాశనము ౭. చూడాకర్మ ౮. ఉపనయనము ౯. నుండి ౧౨. వరకు వేదవ్రతములు ౧౩. గోదానము ౧౪. సమావర్తనము ౧౫. వివాహము ౧౬. అంత్యకర్మ

**మనుస్మృతి :-** ౧. గర్భాధానము ౨. జాతకర్మ ౩. నామకరణము ౪. నిష్క్రమణము ౫. అన్నప్రాశనము, ౬. చూడాకర్మ ౭. ఉపనయనము ౮. కేశాంతము ౯. వేదారంభము ౧౦. సమావర్తనము ౧౧. వివాహము ౧౨. వానప్రస్థము ౧౩. సంన్యాసము ౧౪. అంత్యేష్టి

పైన సూచింపబడిన గ్రంథాలలోనుండి ఒక్కొక్కదానిలో వివరించబడిన సంస్కారముల సంఖ్య క్రిందవ్రాయబడుచున్నది.

| | |
|---|---|
| ఆశ్వలాయన గృహ్యసూత్రమునందు | ౧౩ |
| పారస్కర గృహ్యసూత్రమునందు | ౧౪ |
| అపస్తంభ గృహ్యసూత్రమునందు | ౧౨ |
| కౌశీతకీ గృహ్యసూత్రమునందు | ౧౨ |
| హిరణ్యకేశి గృహ్యసూత్రమునందు | ౧౦ |
| మానవ గృహ్యసూత్రమునందు | ౧౩ |
| గోభిల గృహ్యసూత్రమునందు | ౧౨ |
| జైమిని గృహ్యసూత్రమునందు | ౧౧ |
| ఖాదిర గృహ్యసూత్రమునందు | ౧౧ |
| బౌధాయన గృహ్యసూత్రమునందు | ౧౩ |
| వైఖానస గృహ్యసూత్రమునందు | ౧౩ |
| కౌశిక గృహ్యసూత్రమునందు | ౧౦ |
| గోపథ బ్రాహ్మణ గృహ్యసూత్రమునందు | ౧౦ |
| యాజ్ఞవల్క్య స్మృతియందు | ౧౨ |
| గోతమ స్మృతియందు | ౧౧ |
| అంగిరా స్మృతియందు | ౧౪ |
| వ్యాస స్మృతి యందు | ౧౩ |
| జాతుకర్ణ్య స్మృతియందు | ౧౧ |
| మను స్మృతియందు | ౧౪ |

**గర్భరక్షణము :-** కౌశీతకీ గృహ్యసూత్రాలలో పుంసవన, సీమంతోన్నయన సంస్కారముల మధ్యన కర్తవ్యముగా ఈ సంస్కారము పేర్కొనబడినది. ఇది ఏ ఇతర గ్రంథములోను లేదు.

**కర్ణవేధ సంస్కారము :-** ఇది కేవలము కాత్యాయన గృహ్య సూత్రము, అంగిరాస్మృతియందే నిహితమైయున్నది. సుశ్రుత సంహితలో చూడనగును.

**వాన ప్రస్థసంన్యాస సంస్కారములు :-** ఇవి మనుస్మృతియందే గోచరించును. అన్యత్ర గోచరించవు.

**అంత్యేష్టి సంస్కారము :-** మనుస్మృతి ఆశ్వలాయన గృహ్యము, పారస్కరగృహ్యము, బౌధాయన గృహ్యము, కౌశికసూత్రము, యాజ్ఞ వల్క్యస్మృతి, జాతుకర్ణ్య స్మృతియందు నిహితమైయున్నది.

వాన ప్రస్థ సంన్యాసములు బహుశః గృహ్యకర్మలు కాకుండుటచే గృహ్య సూత్రములందు పేర్కొనబడలేదు. అంత్యేష్టిని కొందరు పేర్కొనిరి.

పైన అనేక కల్పసూత్రములందలి సంస్కారములగూర్చి ఒక పట్టిక యొనగబడినది. అందులో ఏ కల్పసూత్రములందును షోడశ (౧౬) సంస్కారములు గోచరించవు. వాటి యందున్న సంస్కారములు కూడా అన్నింటిలో ఒకేవిధముగను క్రమపూర్వకముగను లేవు. ఆయా సంస్కారము లందలి క్రియలు అన్నింటిలో సమానముగ లేవు. ఉన్న క్రియలు అన్నియు గూడ పూర్తిగా వైజ్ఞానికములు గావు.

వైదికధర్మమును వ్యతిరేకించువారు పైన పేర్కొనబడిన గ్రంథములలో గోవధ మాంసభక్షణము మున్నగు విషయములను ప్రక్షిప్తము చేసిరి. వైదికులు దానిని తెలిసికొనలేక పోయిరి. వారు వేదాధ్యయనమును వదలి అనార్ష గ్రంథములను ఆశ్రయించుటయే ఇందుకు ముఖ్యకారణము. వేదాధ్యయన మును త్యజించుటచే వేదసిద్ధాంతము విస్మృతమైనది. అనార్ష గ్రంథాలను చదువుటచే వారు వేదానుకూల గ్రంథాలలో చేయబడిన ప్రక్షిప్తములను తెలిసికొనలేకపోయిరి. ప్రక్షిప్తములు గూడ మూల గ్రంథములోనివే యని విశ్వసించిరి. ఆ తరువాత కాలమున విద్వాంసులు వాటిపైన వ్యాఖ్యానములు వ్రాసిరి. వారు వేదములను పఠించనందున వారిచే చేయబడిన వ్యాఖ్యానములు వేదవిరుద్ధముగనే యుండెను. ఇటుల ఆర్షగ్రంథాలలో అవైదిక అంశములు ప్రక్షిప్తములైనవి. ఈ ప్రక్షిప్తములు క్రమముగా అధికము కాదొడగినవి. దానివలన ఆతరువాత రచించబడిన ఆధునిక గ్రంథములు పూర్తిగా వేదవిరుద్ధములు, విజ్ఞానవిరుద్ధములు నైనవి. అవి గణపతి పూజ,

నవగ్రహపూజ మున్నగు విజ్ఞానవిరుద్ధ క్రియలతో నిండియున్నవి. వాటియందు వేదానుకూలమైన ప్రాచీన ఆర్షగ్రంథముల సిద్ధాంతములు గోచరించవు.

పై గ్రంథాలలో ౧౦ నుండి ౧౮ సంస్కారములు మాత్రమే పేర్కొనబడినవి. గోతమసూత్రములందు ౧౮ గోతమస్మృతియందు ౪౦ వైఖానస సూత్రములందు ౪౦ అంగిరాస్మృతియందు ౨౫ సంస్కారములు ప్రతిపాదించబడినవి. సంస్కారములు సామాన్యముగా ౧౦. నుండి ౧౮. వరకు గలవు. ౧౮ కన్న అధిక సంస్కారములు లేవు ఒకానొకస్థానములో అవి ౧౮ వరకు ప్రతిపాదించ బడినవి. కాని అవి స్వతంత్ర సంస్కారములు కావు. ఒక సంస్కారమునందలి కొన్ని క్రియలు స్వతంత్ర సంస్కారములుగ పేర్కొనబడుటచే సంస్కారముల సంఖ్య పెరిగినది. నూతనత్వములేదు. కొందరాచార్యులు సంస్కారములతో పాటు పంచమహాయజ్ఞములు, పాకయజ్ఞములు మున్నగువాటిని సంస్కారములుగా పేర్కొనిరి. దానితో వాటి సంఖ్య అధికమైనది. షోడశ సంస్కారములను స్వీకరించిన ఆచార్యులు కూడ ఒక్కొక్క సంస్కారమును విభజించి ఒకటికన్న ఎక్కువగా స్వీకరించి షోడశసంఖ్య పూర్తిజేసిరి.

సంస్కారములు వేదములలో బీజరూపమున గలవు. అవియే ప్రాచీన బ్రాహ్మణ, శ్రౌత్ర, గృహ్యాది సూత్రాలలో వివరముగా వ్రాయబడినవి. ఒక్కొక్క వేదమున కనేక శాఖలు గలవు. ఒక్కొక్క శాఖకు సంబంధించిన కల్ప (= శ్రౌత గృహ్య, ధర్మ) సూత్రములు వేరు. ఆశాఖలలోని కర్మలు వేరు. ౧౧౨౭ శాఖలలోను కొన్ని సమగ్రముగా లేవు. అస్తవ్యస్తమైనవి. ఒక్కొక్క వేదమునకు కల్పసూత్రములు వేరు. ఒక్కొక్క శాఖకు ఒక్కొక్క కల్ప సూత్రముండె నని వైదిక సాహిత్యము వలన తెలియుచున్నది. ప్రస్తుతము సమస్త కల్ప సూత్రములు లభించవు. కొన్నియే లభించుచున్నవి. నాలుగు వేదముల యొక్క శాఖలకు సంబంధించిన కల్పసూత్రములలోని సంస్కారముల క్రమము, వాటి యందలి క్రియలు భిన్నము. వాటిలో మనకు గోచరించుచున్న సంస్కారముల స్వరూపములు అసంపూర్ణము, సంక్షిప్తము, క్రమహీనము. వాటికి వ్రాయబడిన వ్యాఖ్యానములు చాలవరకు వేద సిద్ధాంతమునకు విరుద్ధముగా నున్నవి. వాటిలోని కొన్ని అంశములు ప్రక్షిప్తము లని పైన పేర్కొనియున్నాను. కొన్ని ప్రక్షిప్తముల నిచట చూపుచున్నాను.

మధుపర్కము:- మధు వనగా తేనె, పర్కమనగా సంపర్కము. మధుపర్కమనగా మధువుతో కలిసియుండు పదార్థము, దయానందమహర్షి దధి, మధు లేదా దధిఘృతమని పేర్కొనెను. పెరుగు తేనె లేదా పెరుగు నేయి మధుపర్క మనబడును. ప్రస్తుతము కర్మకాండలో షోడశోపచార పూజాదులలో దధి, ఘృతము, మధు, జలము శర్కరతో సిద్ధమైన పదార్థము మధుపర్కమని పేర్కొనడినది.

"నా మాంసో మధుపర్కో భవతి" ఆశ్వలాయన గృహ్యసూత్రము॥౧-౪-౧౬॥ మాంసములేని మధుపర్కముండదు. అటులే "నా లోహితో మధుపర్కో భవతి" కౌశికసూత్రము ॥ ౯౨ -౧౬ ॥ రక్తములేనిది మధుపర్కముకాదు రెండు సూత్రములకు పూర్వము అనగా ॥ ౯౨ -౧౪ ॥లో కౌశిక సూత్రకారుడు స్వయముగా

**"మాతా అదిత్యానాం దుహితా వసూనాం స్వసారు ద్రాణామమృతస్యనాభిః " ప్రణోవోచం చికితుషే జనాయ మా గామనాగామదితిం వధిష్ట ॥"**
అని పేర్కొనెను. వేద మంత్రములో అనాగాం = పాపరహితము, అదితిం = చంపదగనిదియునైన; గాం = ఆవును మా వధిష్ట = చంపగూడ దని స్పష్టముగా వ్రాయబడియున్నది. ఈ మంత్రములో ఆవు చంపదగని దని వ్రాయబడినది. కావున సూత్రములో పేర్కొనబడిన పశుమేధ వేదవిరుద్ధమని స్పష్టమగుచున్నది. దీనిలో మధుపర్కములో మాంసము, రక్తము వేద విరుద్ధము.

స్నాతకుడు, ఆచార్యుడు, ఋత్విజుడు, రాజు, వివాహము జరిపించుకొనువారు, మిత్రుడు, అను నీ ఆరుగురు వందనీయులు, పూజ్యులు వీరిని గృహస్థులు మధుపర్కముచేత సత్కరించవలయును. వివాహ సమయమున కన్య వరుని గోదానముతో సత్కరింపవలయును. స్నాతకుడు సమావర్తన సంస్కార సమయమున ఆచార్యుని గోదానముతో సత్కరింపవలయును. ఈ సందర్భమున యాజ్ఞవల్క్యస్మృతి యందిటుల పేర్కొనబడినది.

మహోక్షం వా మహాజం వా శ్రోత్రియాయోపకల్పయేత్ ॥ ఆచారాధ్యాయము ౧౦౯ ॥ పెద్దవృషభమును లేదా మేకను చంపి దాని మాంసము సిద్ధమైన పదార్థములతో వేదముల నధ్యయనము చేసిన బ్రాహ్మణునితో సత్కరింపవలయును.

కౌశికసూత్రకారుడు ॥ ౮౩ - ౩౫ ॥లో ఇటుల పేర్కొనుచున్నాడు. "తస్యా దక్షిణమర్ధం బ్రాహ్మణాన్ భోజయతి సవ్యం పితౄన్" బ్రాహ్మణుని కొరకు చంపబడిన ఆవుయొక్క దక్షిణార్ధ భాగముతో బ్రాహ్మణులకు, వామార్ధ భాగముతో పితరులకు భోజనము చేయించును.

పైన పేర్కొనబడిన గ్రంథముల వంటి గ్రంథముల నాధారముగా గొని సలుపబడుచున్న ఈనాటి సంస్కారములు పూర్తిగా వేదబాహ్యములే కాక బుద్ధివిరుద్ధములు, అవైజ్ఞానికములు, అవ్యావహారికములు, హానికరములు. వాటి నవలోకించిన ఏ బుద్ధిమంతుడును వేదబాహ్యము లని సహజముగా పేర్కొనగలడు. ఈ విధముగ వేదసిద్ధాంతము కలుషితము చేయబడెను. వక్రముగ చిత్రించబడెను. దీనిని వేదధర్మము యొక్క పతనావస్థయనక తప్పదు. వేదానుకూలమైన విశుద్ధమైన షోడశసంస్కారములను తెలిసికొనగోరు వారి కిది అయోమయస్థితి, కింకర్తవ్యవిమూఢత్వము, అంధకారబంధురము నిరాశాజనకము.

దయానంద మహర్షి బ్రహ్మవేత్త, తత్త్వజ్ఞుడు. ఆయన వేదములను మొదలుకొని పూర్వమీమాంస వరకు గల వైదిక సాహిత్యమును ఆర్ష బుద్ధితో పరిశీలించిన మహామేధావి, వేదపారదృశ్వా, విలుప్త వేదార్థద్రష్టా. ఆయన వేదముల యథార్థ స్వరూపము నాధారముగా గొని వైదిక సాగరమును మథించి సత్యాసత్యమును సప్రమాణముగా ప్రమాణీకరించిన మహర్షి లుప్తప్రాయమైన వైదిక ధర్మమును పునఃప్రతిష్ఠింపజేసిన పుణ్య పురుషుడు. సంస్కారములచేతనే మానవుడు అవర్ణనీయగుణములచే నలంకృతుడై లౌకిక, పారలౌకిక సుఖముల కర్హుడగు నని ఆయన యోగజ దివ్యదృష్టితో గ్రహించెను.

సమస్త ప్రపంచమున నున్న వైదిక చక్రవర్తి రాజ్యము ఛిన్నాభిన్నమైనది. సమస్త భూమండలమున వ్యాపించియున్న వేదధర్మము క్రమముగా అడుగంటినది. వైదిక వాఙ్మయములలో ప్రక్షేపములు కావొడగినవి. అన్యమతావలంబులు వైదిక సిద్ధాంతాలలో ప్రక్షేపములు చేయదొడగిరి. వైదిక ధర్మ వ్యాప్తి అవరుద్ధమైనది, క్షీణించినది. వేదములలో ప్రక్షేపములు చేయుటకు వీలులేదు. అవి కలుషితముకాకుండ సురక్షితముగా నున్నవి. అందుచే వాటి అర్థములను వికృతముచేయుటకు వివిధ ప్రయత్నములు

జరిగినవి. వివిధసాహిత్యముల నిర్మాణము జరిగినది. దానివలన వైదికులు కూడ వైదిక సిద్ధాంతమునకు దూరము కాదొడగిరి. విశుద్ధమైన వైదిక ధర్మము కలుషితము కాదొడగినది. సమస్త ప్రపంచమున వ్యాపించియున్న సంస్కారముల స్థితియు చాల వరకు లుప్తమైనది. శేషము కలుషితమైనది. సమస్త భూమండలమున అటుంచి ఆర్యావర్తము నందును సమస్త సంస్కారములు గోచరించకున్నవి. గర్భాధానము, పుంసవనము లుప్తప్రాయమై యుండెను. సీమంతోన్నయనము నామమాత్రము మిగిలి యుండెను. జాతకర్మ, నిష్క్రమణము, అన్నప్రాశనము అదృశ్యమైయుండెను. కర్ణవేధము వికృతరూపమును ధరించి స్త్రీలలోనే మిగిలియుండెను.

వివాహము, చూడాకర్మ అర్థహీనమైన క్రియాకలాపములతో వికృత రూపమును ధరించియుండెను. ఉపనయనము కొన్ని వర్గములయందే కనబడుచుండెను. అదియు వేదాధ్యయనముకొరకు ధరించవలసియుండ వివాహమునకు పూర్వము ధరించబడుచుండెను. ఉపనయనము, చూడాకరణము మందిరాలలో, ఆశ్రమాలలో అమంత్రకముగనే జరుగు చుండెను.

ఉపనయనమును వ్రతాదేశమందురు. దానిని ధరించినపుడు బ్రహ్మచారి ఆచార్యునికి, వేదమునకు, యమనియమములకు, శుభగుణము లకు సమీపస్థుడగునను విషయము లోకమునుండి అదృశ్యమై యుండెను. దీనిని దయానంద మహర్షియే స్వస్థానమున ప్రతిష్ఠింపజేసెను.

గృహాశ్రమము ఇతర ఆశ్రమవాసులను అన్నవస్త్రాదులచే పోషించుటచే అది అన్ని ఆశ్రమములలో జ్యేష్ఠాశ్రమ మని చాటిచెప్పినది ఆ మహర్షియే.

ఆనామమాత్రపు సంస్కారములందును నామధారి బ్రాహ్మణులు గణేశపూజ, నవగ్రహపూజ మున్నగు వేదవిరుద్ధ, విజ్ఞాన విరుద్ధ క్రియాకలా పములు చేయించుచుండిరి. వీరి నిరర్థక క్రియాకలాపములవలన బుద్ధి మంతులు వీటిని వ్యర్థమని భావింపదొడగిరి. వికృతమై శోచనీయస్థితికి చేరుకున్న సంస్కారములను, సంస్కారవిధులను పునరుద్ధరించుటకు దయానంద మహర్షి సంకల్పించెను.

దయానంద మహర్షి సమస్తత వేదములను వైదిక వాఙ్మయమును మథించి తన విమలమతితో సంస్కారముల యొక్క సారాసారములను తెలిసికొని, సారమును వెలికితీసి అతినైపుణ్యముతో వేదమును ప్రమాణముగా స్వీకరించు సమస్త వేదానుయాయుల కనుకూలమైన ప్రాచీన వేదోక్త వైజ్ఞానిక షోడశసంస్కారవిధిని రచించి మానవ సమాజమున కొక అనుపమకృతి నందించి మహోపకారము చేసెను.

దయానందమహర్షి ఆరంభమున సంస్కారవిధియందు వానప్రస్థ సంన్యాసములను సమ్మిలితముచేసి ఒకే సంస్కారముగా స్వీకరించెను. పూర్వాచార్యులు కొందరు తమ గ్రంథాలలో పంచమహాయజ్ఞములను శాలాదిసంస్కారములను సమ్మిలితము చేసి గృహాశ్రమ సంస్కార మను నామముతో వాటిని రెండు సంస్కారములుగా గణించిరి. దాని వలన సంస్కారములు పదహారైనవి. మహర్షియు అదేవిధముగ గృహాశ్రమము నందలి కర్మలను కలిపి ఒక సంస్కారముగా పేర్కొనియుండెను. తరువాత ఆయన దానిని పరిశీలించి అందులో మార్పుచేసెను. ద్వితీయ ముద్రణమున వానప్రస్థ సంన్యాస సంస్కారములను స్వతంత్ర సంస్కారములుగా ప్రతిపాదించెను.

గృహాశ్రమకర్మలను సంస్కారములుగా స్వీకరించక గృహాశ్రమకర్మలుగా పేర్కొనెను. అందుచే గృహాశ్రమ సంస్కారవిధియని వ్రాయబడియు అందు విధి ఎచటను లేదు. కావున అది సంస్కారము గాదు. సంస్కారవిధిలో నిపుడు గృహాశ్రమకర్మల స్థానమున "గృహాశ్రమ సంస్కారవిధి"యని, వ్రాయబడిన వాక్యము ముద్రిత మగుచునే యున్నది. గృహాశ్రమమునందలి శాలా కర్మ ఇప్పటికిని శాలా కర్మ సంస్కారమనియు ముద్రితమగుచున్నది. దానిని సంస్కరించవచ్చును గాని సంస్కరించగూడదు. ఏలన గ్రంథకర్త కృతియందు సంశోధనము గ్రంథకర్తయే చేయవలయును. ఇతరులు చేయగూడదు. ఇతరులు సంశోధన చేయుదురేని మూల గ్రంథము యొక్క స్వరూపమే నష్టమగును.

దయానంద మహర్షి స్వీకరించిన షోడశసంస్కారములు న్యూనాధికముగ పారస్కరాది గృహ్యసూత్రము లందును, మనుస్మృతియందును పేర్కొనబడినవే. వేదాది శాస్త్రములయందును పేర్కొనబడినవే. అందులో నవీన మగు సంస్కార మేదియులేదు.

అంత్యేష్టి సంస్కారమును సంస్కారవిధియందు "అంత్యేష్టికర్మవిధి" యని పేర్కొనుటచే అది సంస్కారము కాదా యను సందేహ ముదయించును. అంత్యేష్టి యొక సంస్కారమే. అందుకు కొన్ని కారణములను పేర్కొను చున్నాను.

౧. గర్భాధాన సంస్కార ప్రారంభమున దయానంద మహర్షి దీనిని అంత్యేష్టి యని షోడశసంఖ్యను పూర్తిచేసెను.

౨. అంత్యేష్టి సంస్కార ప్రారంభమున అంత్యేష్టిని అంతిమ సంస్కారమని పేర్కొని సంస్కారముగా స్వీకరించెను.

౩. ఈ సంస్కార ప్రారంభమున వేదప్రమాణము నాధారముగా గొని భస్మమగుట శరీరము యొక్క అంతిమ సంస్కార మని పేర్కొనెను.

౪. ఈ సంస్కారము యొక్క విధి భాగమును ముగించుచు "ఇతి మృతక సంస్కారవిధిః సమాప్తః" అని స్పష్టముగా వ్రాసెను.

దయానంద మహర్షి రచించిన సంస్కారవిధి అన్వర్థము, పరిపూర్ణము, వేదోక్తము, వైజ్ఞానికము, నిర్దుష్టము, వ్యావహారికము. కావుననే ఆయనచే రచించబడిన సంస్కారవిధి సంస్కార ప్రపంచమున నూతన యుగమునకు నాంది పలికినది.

సంస్కారవిధి యనబడు ఈ గ్రంథరత్నము యొక్క ఆవిర్భావము తరువాత సంస్కారజగత్తున నవీన యుగము ప్రారంభమైనది. ఇంతకు పూర్వము సంస్కారమన నేమి? దాని ప్రయోజన మేమి? సంస్కారము లెన్ని? వాటి క్రమ మేది? వాటి స్వరూప మేదియను విషయములు అజ్ఞాతముగానే యుండెను. దయానంద ఋషియొక్క సత్ప్రయత్నముచే ఇపుడు వీటికి సుస్పష్టముగా సమాధానము లభించినది. సంస్కారముల విషయములో సందిగ్ధత, అజ్ఞేయత తొలగిపోయినది. సంస్కారముల వైజ్ఞానిక దివ్యరూపము ప్రపంచమున ప్రకటమైనది.

దయానంద మహర్షికి ఇది యంతయు కరతలామలకమువలె తెలిసి యుండెను. దీనిని దృష్టియం దుంచుకొని ఆయన సమస్త ప్రపంచమునం దార్యుల చక్రవర్తి రాజ్యముండె నని పేర్కొనెను. సృష్టి మొదలుకొని మహాభారత కాలమువరకు ఆర్యవంశీయులే చక్రవర్తి, సార్వభౌమ రాజులైయుండి రని సత్యార్థప్రకాశము ఏకాదశ సముల్లాసమున స్పష్టముగ పేర్కొనెను. "ఇక్ష్వాకు మొదలుకొని కౌరవ పాండవులవరకు సమస్త భూమండలమున ఆర్యులరాజ్య ముండెను. ఆర్యావర్తేతర దేశములందు వేదముల ప్రచారము స్వల్పముగా నుండెను." అని ఆయన సత్యార్థప్రకాశము అష్టమ సముల్లాసమున వ్రాసెను. అందుచే ఆయన సంస్కారవిధియం దాదిలో "ఆర్యైతిహ్యం పురస్కృత్య" ఆర్యుల చరిత్రను సమక్షమున నుంచుకొని జనులకు సులభముగా బోధపడుటకు వేద ప్రమాణములు గల ఉత్తమ సంస్కారవిధి ప్రకాశింప బడుచున్నదని స్పష్టము చేసెను.

దయానంద మహర్షికి పూర్వము గృహ్యసూత్రకారులు, ధర్మ సూత్రకారులు, స్మృతికారులు మరియు ఇతర ఆచార్యు లనేకులు అనేక కారణములచే అంత్యేష్టిని సంస్కారముగ స్వీకరించలేదు. వేదానుకూల మగుటచే, మనుమహర్షి ప్రతిపాదితమగుటచే నిది యొక సంస్కార మని దయానంద మహర్షి స్వీకరించెను. కొన్ని గృహ్యసూత్రము లీ సంస్కారమును వర్ణించినవి. యాజ్ఞవల్క్య, జాతుకర్ణ్యులు దీనిని తమ సంస్కారములలో చేర్చుకొనిరి. మహర్షి కృత సంస్కారవిధి ప్రభావమువలన ఇపుడనేక విద్వాంసులు అత్యేష్టిని సంస్కారముగా స్వీకరించి తమ సంస్కారవిధాయక గ్రంథాలలో పొందుపరచిరి. అటులే కర్ణవేధ సంస్కారమునకు సంస్కారములలో ప్రాయః స్థానము పరిగణింపబడుచున్నది. సుశ్రుతసంహిత మున్నగు ఆయుర్వేద సంహితలయం దీ కర్ణవేధము గూర్చి విపులముగా వ్రాయబడినది. ఈ సత్యము వేల సంవత్సరములవరకు మరుగునపడి యుండెను. దయానంద మహర్షి ప్రతిపాదనవలన ఈ విజ్ఞానము లోకమునకు తెలిసినది. దీనితో మహర్షి దివ్యదృష్టి విదితమగుచున్నది. సంస్కారముల క్షేత్రములో దయానంద మహర్షి యొక్క క్రాంతి ఉజ్జ్వలము. దానివలన ఆయన ప్రతిపాదించిన సంస్కారములకు లోకమున మాన్యత (గుర్తింపు) లభించినది. విశిష్ట విద్వాంసులనేకులు ఆయన రచించిన సంస్కారవిధికి విస్తృత వ్యాఖ్యానములు రచించిరి. ఉదాహరణకు :-

౧. **సంస్కారచంద్రిక:** ఇది పం. భీమసేనశర్మ రాజ్యరత్నమాస్టర ఆత్మారాం అమృతసరీగారలచే నిర్మించబడిన బృహద్గ్రంథము. ఇందు సంస్కారముల యందు నిర్వహించబడు క్రియల మహత్త్వము ఆయుర్వేద ఆధారముతో, భౌతిక విజ్ఞానము యొక్క ఆధారముతో ఐతిహాసిక ఘట్టములతో ప్రతిపాదింపబడినది. అదే విధముగ యజ్ఞమున కుపయోగపడు సకల పదార్థములు, క్రియలు ప్రతిపాదింపబడినవి. సమస్త మంత్రములకు విస్తృత వ్యాఖ్యానము వ్రాయబడినది. దీనిని సంస్కారవిధికోశము అనవచ్చును.

౨. **అభినవ సంస్కార చంద్రిక:** ఇది పం. భీమసేనశర్మ, పం. హరిదత్తశాస్త్రి గారలచే రచించబడిన బృహద్గ్రంథము. ఇదియు పై గ్రంథమును బోలియున్నది.

౩. **సంస్కార చంద్రిక :** ఇది పం. సత్యవ్రత సిద్ధాంతాలంకారగారిచే రచించబడిన బృహద్గ్రంథము. ఇదియు పై గ్రంథమును బోలిన విశిష్ట గ్రంథము.

౪. **సంస్కార భాస్కరము:** ఇది స్వామీ విద్యానంద గారిచే నిర్మించబడిన బృహద్గ్రంథము. ఇదియు పై గ్రంథములను బోలియున్నది. పై గ్రంథములలో ప్రతిపాదించబడిన శైలికి భిన్నశైలిలో వేరొక విధముగా వ్యాఖ్యానించబడినది.

౫. **సంస్కారసముచ్చయము :** ఇది పం. మదనమోహన విద్యాసాగర గారిచే రచించబడిన బృహద్గ్రంథము. ఇందులో సంస్కారముల వివరణతోపాటు మంత్రములకు ద్వివిధ, త్రివిధ అర్థములు పొందుపరచబడినవి. సంస్కారేతర వాగ్దానము మున్నగు క్రియల పద్ధతియు పేర్కొనబడినది.

౬. **సంస్కారవిధి (సటిప్పణం) :** ఇది పం. యుధిష్ఠిర మీమాంసకగారిచే సంపాదితము. ఇందు సంస్కారవిధి గ్రంథము యొక్క ఆవిర్భావమునుండి ఇంతవరకు గల చరిత్ర విపులముగ సప్రమాణముగా వ్రాయబడినది. ప్రతిమంత్రము యొక్క చిరునామ, విశుద్ధముద్రణ, గ్రంథములోని సమస్త క్రియల శీర్షికలు, చివర ౧౨ పరిశిష్టములు దీని వైశిష్ట్యము. ప్రథమ పరిశిష్టములో సంస్కారవిధికి సంబంధించిన ౩౬ విషయముల స్పష్టీకరణ గలదు. దీనిని సంస్కారవిధి స్వరూపమునకాదర్శ మనవలయును.

ఇవిగాక సంస్కారవిధికి సంబంధించిన అనేక పుస్తకములు ప్రకాశితమైనవి. ఈనాడు ఆర్య సమాజికులేకాదు పౌరాణికులు సహితము దయానందమహర్షి విరచిత సంస్కారవిధితో సంస్కారములు చేయుచున్నారు. ఈ గ్రంథము ఆర్యావర్తమందలి అనేక భాషలలో అనువదింపబడినది. ఆంగ్లభాషలోనూ అనూదితమైనది. దీనినాధారముగా జేసికొని విదేశాలలోనూ సంస్కారములు జరుపబడుచున్నవి.

దయానంద మహర్షి దక్షిణభారతమును తన శుభాగమనముతో పావనము చేయలేదు. ఆయన సమస్త ఆర్యావర్తములో వైదికధర్మమునకు పునాదులు వేసి వైదిక ధర్మమును సుదృఢము చేయవలసియుండెను. ఆ పైన ప్రపంచములోని ఇతర దేశాలకు వెళ్ళి దానిని వ్యాపింపజేయవలసి యుండెను. ఆయన దక్షిణదేశమునకు రాకముందే ఆంగ్ల ప్రభుత్వముచే బలిగొనబడెను. ఆయన అకాలమృత్యువుచే ఆయన సమస్త పథకములు నిలిచిపోయినవి. ఆయన అనుయాయులు వాటిని సాకారముచేయుటకు యత్నించుచున్నారు. ఆయనచే రచించబడిన కొన్ని గ్రంథములు తెలుగులో అనూదితమైనవి. అందులో ఒకటి సంస్కారవిధి. అది శ్రీ పం. ధూలిపేట రాజరత్నమాచార్యగారిచే అనూదితమై ౫౦ సంవత్సరముల క్రితము విక్రమ సంవత్సరము ౨౦౦౬ లో ప్రకాశితమైనది. మహర్షి భావములను జనుల కందించదలచియే వారు మహర్షి ఎడ శ్రద్ధతో సంస్కారవిధి నను వదించిరి. వారికి ఆర్యభాషా జ్ఞానము స్వల్ప మనిపించినది. దానిచే గ్రంథాభి ప్రాయము తెలుగులో గోచరించదు. కర్మకాండ విషయమగుట వలన కర్మకాండ పరిజ్ఞానము కలవారే సంస్కారవిధి నర్థము చేసికొనగలరు. వారిచే అనువదించబడిన గ్రంథముకూడ ఇపుడు లభించుటలేదు.

సంస్కారమను శబ్దమునకు ఒకానొక దేశీయభాషలోగాని ప్రాంతీయ భాషలోగాని అర్థము వ్రాయుట అసంభవమే Ceremony అను ఆంగ్లశబ్దము, Caerimonia అను లాటిన్ శబ్దము సంస్కార శబ్దము యొక్క అర్థమును స్పష్టీకరించజాలవు. బహుశః ఈ శబ్దములు కర్మ శబ్దమున కపభ్రంశములు కావచ్చును. మానవుని సర్వాంగీణ అనగా శారీరక, వాచిక, మానసిక, సామాజిక ఉన్నతికొరకు శారీరక, మానసిక, వాచిక శుద్ధికొరకు, ఇహలోక పరలోక

సుఖప్రాప్తికొరకు చేయబడుక్రియలు సంస్కారము లనబడును. దేనివలన మానవుడు శారీరకముగ, ఆత్మికముగ పునీతుడై వర్ధించుటకు సాధ్యము కానంత గుణోత్కర్షను సంపాదించునో అది సంస్కార మనబడును. మానవుని మానవునిగా తీర్చిదిద్దుటకు ఉత్తమ సాధనమైన ఈ గ్రంథము ఈనాడు తెలుగుభాషలో లేకుండుట కడుశోచ నీయము. సంస్కారముల యొక్క వ్యాఖ్యానము, వైజ్ఞానిక విశదీకరణము, నటుంచి దయానంద మహర్షిచే ప్రకాశితమైన సంస్కారవిధియు ఉన్నదున్నట్లుగా ఇంతవరకు తెలుగులో ప్రకాశితము కాలేదు.

ఈ గ్రంథములో రెండు భాగములు గలవు. ౧. సంస్కారమునకు సంబంధించిన ప్రమాణములు, ఉపదేశము, తదుపరి సంస్కారమువరకు అనుష్ఠించవలసిన కర్తవ్యము. ౨. సంస్కార విధి. సంస్కారవిధి కేవలము సంస్కార కర్మలకొరకు నిర్మించబడలేదు. ఉత్తమగుణ సంపన్నుడైన మానవుని నిర్మాణము కొరకవసరమగు సమస్త జ్ఞానము దానిలో పొందుపరచబడినది. ఇది సంస్కారవిధిలో హృదయము వంటి భాగము. ఇదియొక కర్తవ్యశాస్త్రము. ధర్మశాస్త్రము. ఈ అంశము ధర్మశాస్త్రమువలె పఠించదగినది. మిగిలిన విధి భాగము కేవలము కొన్ని గంటలలో సంపన్నము చేయదగిన క్రియా సమూహమే. దయానంద ఋషి ఏ ఉద్దేశముతో ఈ గ్రంథమును రచించెనో సంస్కారవిధిలోని ఆ అంశము పం. గోపదేవ శాస్త్రి. పం. విశ్వామిత్రగారల తెలుగు అనువాదములలో కానరాదు. కొంత మిశ్రణము కూడ చేయబడినది. నిజమున కవి సంస్కారవిధియందలి విధిభాగమునకే యనువాదములు. వాటి వలన సంస్కారవిధి గ్రంథరచన ప్రయోజనము పూర్తికాదు. ఆ రెండు సంస్కారవిధులు కేవలము సంస్కారములు సలుపుట కుపయోగపడగలవు.

ఉత్తమ మానవుడగుటకు సంస్కారములాధారము సంస్కారములు మానవుని ఆత్మను, శరీరమును సంస్కరించును. ఈ విషయము సంస్కారములలోని క్రియలను వాటి యొక్క వైజ్ఞానిక స్వరూపమును తెలిసికొన్నపుడు అర్థముకాగలదు. ఆ క్రియలు శరీరమును మరియు ఆత్మను సంస్కరించు స్వరూపమును = విధానమును = పద్ధతిని స్పష్టముగా తెలిసికొనుట అవసరము. ఇదియే మానవ జీవన నిర్మాణమున కవసరమైన అతి సూక్ష్మ సంస్కార విజ్ఞానము. దీనిని వివరించి ఉదాహరణ పూర్వకముగ ప్రతిపాదించినపుడు పరమనాస్తికులుకూడ సంస్కారముల యొక్క మహత్త్వమును మనస్ఫూర్తిగ స్వీకరింతురు.

వైదిక ధర్మమును సమస్త మానవ సమాజమున వ్యాపింపజేసి మానవ సమాజము నుద్ధరింపగోరువారికి సంస్కారములు ఒక విశిష్టసాధనము. లోకమున సంస్కారములు జరుగుచుండును. ఆ సందర్భమున ఆయా సంస్కారముల యొక్క సూక్ష్మవైజ్ఞానిక స్వరూపమును వైజ్ఞానిక పద్ధతిలో వ్యాఖ్యానించి శ్రోతలను వైదిక ధర్మము వైపు ఆకర్షింపజేయవచ్చును. ఈ విధముగా సంస్కారములచే వైదికధర్మ ప్రచారము జరుగును. వేదికలపైనుండి ఉపన్యసింపజాలని పురోహితులు కూడ సంస్కారములచే శ్రోతలను వైదికధర్మము నెడ శ్రద్ధాన్వితులను చేయగలరు. ఈ విధముగ శ్రోతలు ప్రభావితులు కాకుండ ఉండజాలరు. సంస్కారములచేతనే వైదిక ధర్మ ప్రచారము సరళము, సులభసాధ్యము. కావున వేదధర్మానుయాయులు అధికాధిక సంఖ్యలో సంస్కారములయొక్క దివ్యస్వరూపమును తెలిసికొని సంస్కారములచేత వైదికధర్మ ప్రచారము చేయగోరుచున్నాను. సంస్కారములు సలుపగోరువారికి దయానంద మహర్షి రచిత సంస్కారవిధి అద్భుతసాధనము. పైన పేర్కొన్నటుల ఇది స్వాధ్యాయము కొరకు అవసరమగు ధర్మశాస్త్రమేగాక ధర్మ ప్రచారమున కుపయోగపడు ఉత్తమ గ్రంథముకూడ.

ఈ విషయమును దృష్టి యందుంచుకొని దయానందమహర్షి రచించిన సంస్కారవిధిని ఆ మూలాగ్రము అనువదించి ప్రచురించుచున్నాను.

**ఈ సంస్కరణ యందలి విశేషములు**

౧. ఇది దయానంద మహర్షి రచిత సంపూర్ణ సంస్కారవిధికి అనువాదము.
౨. ఉద్ధృత మంత్రముల మరియు వచనముల శుద్ధపాఠము వ్రాయబడినది. వాటి మూలము (లభించినంతవరకు) వ్రాయబడినది.
౩. పరిశిష్టములో సంస్కారముల సంక్షిప్త మహత్త్వములతోపాటు ఇతర అనేక విషయములు విశదముగా వ్రాయబడినవి.
౪. అనేక పరిశిష్టములు, జతపరచబడినవి.
౫. దైనిక మరియు బృహద్యజ్ఞమునందలిక్రియలు, వాటిక్రమము వివరముగా వ్రాయబడినవి.
౬. యజ్ఞములు, సంస్కారములు నిర్వహించువారికి మహత్త్వపూర్ణమైన అనేక సూచనలు పొందుపరచబడినవి.
౭. సంస్కారవిధి యందలి మంత్రాదుల అకారాదిక్రమము సూచీ చేర్చబడినది.